# అంతర్మథనం

## గేయ-కవితా సంపుటి

నెమ్మాని మోహన మూర్తి

శ్రుతి కళా నికేతన్
రిజిష్టర్డ్ నం.1389/95
సంగారెడ్డి - 502 001, జిల్లా మెదక్

ప్రథమ ముద్రణ జనవరి 1996

ప్రతులు 1000



వెల : రూ.20-00 లు

ప్రతులకు సంప్రదించండి

**నెమ్మాని మోహన మూర్తి**

జిల్లా సహకార కేంద్ర బ్యాంకు లి., మెదక్

సంగారెడ్డి-502 001.

శాశ్వత/ప్రస్తుత చిరునామా

ఇం.నం. 4-3-35

కుత్బుల్లాపూర్

HMT దగ్గర - హైదరాబాద్ - 55

ముఖచిత్ర రచన :

శ్రీ గంగాధర్, హైదరాబాద్

ముద్రణ :

సూరజ్ ప్రింటర్స్, హైదరాబాద్

గమనిక : ఇందులోని కవితలు, గేయాలు ఏ విధంగా ఉపయోగించుకోవాలన్నా రచయిత అనుమతి తప్పని సరి.

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్,
**డా॥ సి. నారాయణ రెడ్డి,** ఎం.ఏ., పి.హెచ్.డి., డి.లిట్.

ఫోను : 248451
ప్లాట్ నం. 48, రోడ్ నం. 6,
ఫిల్మ్‌నగర్, జూబ్లీహిల్స్,
హైదరాబాద్-500 033.

# అభిప్రాయం

మనసున్నప్పుడు మథనం తప్పదు. మథనం కలిగినప్పుడు దాన్ని వెలువరించాలనే తపన అందరికీ ఉంటుంది. ఆ తపన పదునైన భావాలతో, సమర్థపద జాలంతో అభివ్యక్తమైతే కవితగా రూపొందుతుంది.

శ్రీ నెమ్మాని మోహనమూర్తి మనోమథనం గేయతుల్యంగా, వచన సదృశంగా వెల్లుబికి వచ్చింది. ఈ సంపుటిలోని చాలా రచనల్లో అతని భావతీవ్రత స్పష్టమవుతుంది. "అద్దం అబద్ధం చెప్పదు" లాంటి సునిశిత సూక్తులు ప్రకటించే మోహనమూర్తి పొగడ్తల అగడ్తలను గురించి జనారణ్యంలో పంజాల పాలైన పడతులను గురించి అటు అధిక్షేపాత్మకం గానూ, ఇటు ఆర్ద్రంగానూ రచనలల్లడం గమనించదగ్గ అంశం.

సమకాలీన సమాజంలోని స్వపర వంచనలను, కుహనామూల్యాల మోహరింపులను కొన్ని కవితల్లో ఎంతో సూటిగా ఎత్తి చూపాడు ఈ రచయిత.

వివిధ సందర్భాల్లో తనలో ఆవిర్భవించిన అనుభూతులను, ఆలోచనా రీతులను కవితల రూపంలో ఆవిష్కరించిన మోహనమూర్తి సాధనదశ మరింత పురోగమన శీలంగా సాగిపోయి గణనీయ పరిణతిని అందుకోవాలని ఆశిస్తున్నాను

(- డా॥సి. నారాయణ రెడ్డి)

**G. ELECTION REDDY**
President

The District Co-operative
Central Bank Ltd., Medak
H.O. Sangareddy

# అభినందన

శ్రీ నెమ్మాని మోహన మూర్తి, మా బ్యాంకులో ఉద్యోగిగా, యూనియన్ ఉపాధ్యక్షుడిగానే నాకు తెలుసు. ఈ మధ్య తాను వ్రాసిన 'అంతర్మథనం' అనే గేయ కవితా సంపుటికి సందేశమివ్వాలని అడిగినప్పుడు ఈతనికి రచనా వ్యాసంగంలో కూడా ప్రవేశం ఉందా అని ఆశ్చర్యమేసింది.

'అంతర్మథనం' చదువుతున్నంతసేపూ శ్రీ మోహనమూర్తి భావ పరంపరకు విస్తుపోయాను. చక్కటి అంశాల్ని వస్తువుగా ఎన్నుకొని తనదైన శైలిలో కవితలు, గేయాలు వ్రాయటం నాకు బాగా నచ్చింది. యువతకు ఆదర్శప్రాయమైన సందేశం 'జాగృతి', స్త్రీ అభ్యుదయం గురించి 'జనారణ్యంలో జననీ'లో భావావేశం పదునెక్కి 'మృగయా వినోదం' కొరడా ఝుళిపించినట్టుగా వుం[illegible]. 'అమ్మ' ను విశాల సాగరం కంటే ఉన్నతంగా పోల్చి, ఆ తల్లి ఈ జగమంతా నిండివుందనే భావన ప[illegible]మైన తల్లి ప్రేమకు తలమానికమైంది. పుట్టినవాడు గిట్టక మానడు అనే సందేశంతో 'అహప్రస్థానం' లో కూడా జాతి సమగ్రతను బోధించి 'మీరు నడవలేని సన్మార్గపు బాటలు, నా పాలిట వరాల మూటలు' అని చెప్పి, ఈ నాటి సమాజంలో ఆ సన్మార్గపు విలువలు అడుగంటాయని మథన పడటం సహజం - నిజం కూడా.

ఈ 'అంతర్మథనం' లో ప్రతి ఖండిక ఒక ప్రత్యేకతను సంతరించుకుని, మోహన మూర్తి శైలి శాంత గంభీరంగా, కళ్ళకు కట్టినట్లుగా, అందరికి అర్థమయ్యే రీతిలో వుండి ఆకట్టుకుంటుంది.

శ్రీ నెమ్మాని మోహన మూర్తి, ముందు ముందు యింకా మంచి మంచి రచనలు చేయాలనీ, అతనిలో దాగియున్న కళాపిపాస ఉన్నత శిఖరాలను అందుకోవాలని ఆశిస్తూ, హృదయపూర్వకంగా 'అభినందన' అందజేస్తున్నాను.

తేది : 1-1-96

సం॥

స్థలము : సంగారెడ్డి

**[జి. ఎలక్షన్ రెడ్డి]**

# ఆశంస

గతంలో "పాంచజన్యం" పూరించి నిద్రాణంలోవున్న సమాజాన్ని జాగృతం చేసే ప్రయత్నం గావించారు నెమ్మానిగారు. ప్రస్తుతం సమాజంలోని సమస్యల పరిష్కారం కోసం హృదయంలో జారుకొని అంతర్మథనం చేశారు.

మిత్రులు సుహృదయులైన నెమ్మాని మోహనమూర్తి గారు నటుడిగా తొలి రోజుల్లో పరిచయమయ్యారు. త్యాగరాయ గానసభ హైదరాబాదులో తమ శృతి కళానికేతన్ సంస్థ ద్వారా నాటకోత్సవాలను నిర్వహించి ఎ.ఆర్. కృష్ణ గారిని సన్మానించి రాష్ట్ర స్థాయి నాటక రంగ చరిత్రకెక్కారు. యువ ఉగాది కవి సమ్మేళనంలో కవులుగా తెలుసుకున్నాను. వృత్తిరీత్యా బ్యాంకు ఉద్యోగం, ప్రవృత్తి లలితకళా సేవ.

పాఠకులకు సామాజిక స్పృహ కలిగించడానికి శ్రీ నెమ్మాని గారు గావించిన ప్రయత్నం ఫలించగలదని ఆశిస్తున్నాను. నాటక సంగీత సాహిత్యాలకు శృతి కళానికేతన్ సంస్థ ద్వారా ప్రాణం పోస్తున్న గొప్ప నటులే కాక, సంగీత వ్యాప్తి గావిస్తున్న కళాపోషకులే కాక - నిర్మొహమాటంగా, సూటిగా చెప్పగలిగే కవులు గూడా. లలిత కళామతల్లికి పారాణి దిద్దడంలో వారు జీవితాన్నంకితం గావించారనుటలో అతిశయోక్తి లేదు. వీరి కళా సేవకు నా హృదయ పూర్వక అభినందనలు.

ఇట్లు

సహృదయుడు

సం॥

**(సన్యాసిరావు)**

జిల్లా పౌర సంబంధాల అధికారి

సంగారెడ్డి, మెదక్ జిల్లా.

# పరివేదిక

మానవులలో వచ్చిన పరిణామంతోపాటు సాహిత్యంలో కూడా పరిణామం వచ్చింది. పూర్వ కవుల కవితాకన్య చిలికించిన సుధాబిందువుల స్థానంలో, ప్రస్తుత మానవ సమాజ పరిస్థితుల కనుగుణంగా సమకాలీన సామాజిక-రాజకీయ రుగ్మతలే కవితా వస్తువులుగా నిలుస్తున్నాయి. అభ్యుదయం-భావకవిత్వం-విప్లవ కవిత్వం వచన గేయ రూపాలలో కొన్ని ఆత్మాశ్రయంగా కూడాను, సింబాలిజం ముసుగులో అలంకరించుకుంటుంది. కవిత ప్రాసక్రీడలలోంచి, లయ, విలయంలోంచి తొంగి చూస్తుంది. ఇది ఛందో రూపానికి మారు రూపాలయితే కావచ్చునేమో. శబ్దార్థాలంకారాల పరిహసిస్తున్నట్టు నటిస్తూనే వాటితోనే శోభను సంతరించుకుంటుంది. వస్తు-భావ-భాషా నవ్యతతో యూనివర్సలైజ్ అయ్యింది.

కవిత నారాధిస్తున్న వారెందరో కవులు, అభ్యుదయ పథంలో "శ్రీశ్రీ" మార్గంలో నడుస్తూనే ఉన్నారు. సాహిత్య వనంలో కవిగా వెలగాలంటే శైలి సొంతమై, వస్తునూతనమై ఉండాలని ప్రముఖుల అభిప్రాయం.

మిత్రుడు నెమ్మాని తన అంతర్మథనానికి పరివేదిక కోరారు. వీరు గొప్ప నటులే కాదు, కవులు కూడా. సామాజిక వికృతాలను కన్నులారా గాంచిన వీరి హృదయం విలపించగా పరిష్కారానికై తన్నుతాను మథించుకున్నారు.

కవి తన కవితా విపంచిలో విషాద గీతాల నాలపిస్తూనే శివరంజని లోంచి సందేశాలు సంధిస్తూ మోహనంలోకి పరిణమింపజేశారు. స్త్రీవాద ధోరణి పక్షంలో మొగ్గినట్టు వీరి కొన్ని కవితల వల్ల స్పష్టమవుతూనే ఉన్నది. వీరి కలం అబలలకు బలాన్ని చేకూర్చింది. ఆత్మాశ్రయంలో మునిగి అక్కడక్కడ స్వాతిశయంతో హెచ్చరకల చురకలు విసరింది. ఉదాత్త భావోద్వేగంతో వీరి కలం ఉరకలేసింది. కాలం విలువ-ఆకలి బాధ- పొగడ్తల అగడ్త- అధునిక ప్రచార వైఖరి బాల్యదశ నైర్మల్యం - అక్షర పరమార్థం - ధనం విలువ మొదలగు పాత కొత్త కలయికల వస్తు సంచయనం గావించారు. భారతి ఆవేదనను - అబల విలువలను అవగతం చేసుకుని, ఆవేదన చెంది, ఆక్రోశిస్తూనే ఆచరణాత్మకమైన సందేశమార్గం చూపారు. ఆంధ్ర గాంధి అభిమానులై బాపూ మార్గాన్ని దర్శించారు. కన్న తల్లికి ఉన్నత విలువనిచ్చినా, ఊహా సుందరి మురిపాలలో కాసింత కునుకు తీసారు. మగాడిని, యువతను హెచ్చరిస్తూ, కప్పల నుంచి తప్పుకోమని - మద్యం నీడ నుంచి తొలగమని సమాజానికి స్నేహితునిగా హితవు బోధిస్తూ, అహప్రస్థానం గురించి చక్కగా ప్రస్తావించారు.

గతంలో పాంచజన్యం పూరించి నిద్రాణంలోని సమాజాన్ని జాగృతంచేసే ప్రయత్నం గావించారు, నెమ్మాని గారు. పరిణితి చెందిన వీరి కలం నుంచి సుదీర్ఘ కవితలే గాక సంక్షిప్త కవితలు, సందేశాత్మకాలైన భిన్నభిన్న వస్తు రూపాలూ స్రవించాయి. పాఠకులకు సామాజిక స్పృహ కలిగించటానికి హితోధికంగా కృషి గావించారు. సంగీత ప్రియులగుటచేత తన కవితలు ప్రజల గొంతులలో నినదించాలనే ఉద్దేశ్యంతో చాలా వరకు గేయ కవితా రూపంలో మలిచారు. ప్రాసక్రీడలతో వచన కవితల పోకడలు కూడా ఎరిగిన వీరు భావ గాంభీర్యంతో, భాషా ప్రౌఢతకు ప్రయత్నిస్తూనే నిరాడంబర శైలికి ప్రాధాన్యత నివ్వడంలో సఫలీకృతులైనారు.

ఏది చెప్పినా నలుగురు వొప్పేదే చెప్పారు. గగనోపమాన జఘనాలను తాకకుండా, వలపు బాణీ వీణను మీటకుండా, సమాజ రుగ్మతలకు స్పందించి మోహినిలా పక్షపాతం చూపకుండా, అందరికీ పరిష్కార ఔషధామృతం పంచే ప్రయత్నం చేశారు మోహనులు. కవిగా ఎదగాలన్న ఈ తపన నాటక కళనుండే అంతర్మథనంగా సాగి ఆవిరిలా ఆవరించి, మేఘమై గర్జిస్తూ ఈ రూపంగా వర్షించింది. మథనంలో జనించిన భిన్న భిన్న వస్తు జాలాలు వివిధ మహత్తులతో జగత్తులో వ్యక్తం కాగా, అవ్యక్త సందేశం అన్ని రకాల వారికి అందించిందనవచ్చు.

స్నేహ సాగరాన్ని చూస్తే అపరిమిత దాహంతో వేగి పోయే వీరి హృదయం, అతి సుతిమెత్తనది. నిర్మొహమాటంగా, సూటిగా చెప్పటం వీరికలవాటు. ఇందులో కొంత కఱకు చెఱకులా పైకి కనిపిస్తూందే కాని, చిగురాకు కదిలితే చలించే సుతిమెత్తని సుహృదయులు. లలిత కళామతల్లి సేవనలో తనవంతు కర్తవ్యంగా జీవితాన్నంకితం గావించారనడంలో అతిశయోక్తి లేదు. వీరి కళా సేవకు నా హృదయపూర్వక అభినందనలు. ఈ కవితా సంపుటిలోని గేయాలు సంగీత ప్రియుల గళంలోంచి సుస్వరాల గీతాలై జాలువారి సంగీతాభిమానులను అలరించగలవని ఆశిస్తూ, ఈ అంతర్మథనం, యిలా యిలా కొనసాగిస్తూ, సాహితీ జగత్తునకు నూతన శోభ చేకూర్చగలరని ఆకాంక్షిస్తూ .......

**బోర్పట్ల హనుమంతాచార్యులు**

సంగారెడ్డి
మెదక్ జిల్లా

# ఆకాంక్ష

క్షీర సాగర మథనం ద్వారా లోక కళ్యాణమైన ఎన్నో.... మరెన్నో...... అద్భుతాలు, వరాలు ప్రసాదింపబడినట్లే మిత్రులు శ్రీ నెమ్మాని మోహనమూర్తి విరచితమైన "అంతర్మథనం" ద్వారా యీనాటి సమాజానికి, దాని అభివృద్ధికి ఉపయోగకరమైన, అత్యవసరమైన ప్రబోధాలు (ఓ రకంగా హెచ్చరికలని కూడా చెప్పొచ్చు!) వెలువడ్డాయి.

తీరిక సమయాల్లో ఉబుసుపోక తనలో చెలరేగిన భావాలను కాగితం మీద పరుగెత్తించి, తెల్ల కాగితాన్ని నల్లగా చేయటంతో ప్రారంభించిన మా మోహనమూర్తి కృషీవలుడై ... నిత్యసాధనతో ... సమాజంలో వీరంగంచేస్తున్న అన్యాయాల మీద, అక్రమాల మీద - మానవ జాతిలోని పరస్పర వైషమ్యాల మీద - తన "పాంచజన్యం" పూరించి సామాజిక స్పృహ, దేశ శ్రేయస్సు ప్రతి వారి ప్రథమ కర్తవ్యాలని ఎంతో నేర్పుగా - మన చెవుల్లో గింగురుమనిపించాడు.

సాహిత్యంలోనే కాక, నాటక రంగంలో కూడా అలుపెరుగని జీవి మోహనమూర్తి. ఓ నాటకం తాలూకు రిహార్సల్స్ జరుగుతున్నాయంటే - అందరికంటే ముందే హాజరు! ఓ నాటకం ప్రదర్శిస్తుంటే తను ధరించే పాత్రలో జీవించి, దాన్ని పండించటమే కాకుండా - స్టేజీ కట్టటం దగ్గర్నుంచీ, నాటకానంతరం కట్టినవి విప్పటం వరకూ - అవిశ్రాంత కృషీవలుడు నెమ్మాని! కార్యక్రమ నిర్వహణలో అందెవేసిన చేయిగా వుండి మా శృతి కళా నికేతన్‌కు వెన్నుపూసగా నిలిచి, నాటక సమాజంలో అడుగిడినప్పటి నుండి ప్రధాన కార్యదర్శిగానే ఏకగ్రీవంగా ఎన్నుకోబడుతున్న శ్రమైక జీవి నెమ్మాని!

ఒక విధంగా - మా మోహనమూర్తి హృదయానికి, మనస్తత్వానికి దర్పణం యీ "అంతర్మథనం" తనకే కాకుండా - ఎదుటి వారికెవరికైనా సరే - ఏదైనా అన్యాయం, అక్రమం జరిగితే, బాధకలిగితే - అది తనకే జరిగినట్లుగా చలించిపోయి - తన కోపాన్ని, ఉక్రోషాన్ని, బాధను అక్షర రూపంలో తన రచనల్లోనే ప్రస్ఫుటింపచేసే సున్నిత మనస్తత్వం అతనిది! (భగవత్ప్రసాదితమైన సాహిత్యపిపాస తోడయింది కనుక).

తన రచనా పాటవంతో "పాంచజన్యం" పూరించిన మోహనమూర్తి కలం - "అంతర్మథనం" లో భావస్పష్టత, వస్తు నాణ్యతతోపాటు - భాషా పరంగా కూడా ఉన్నతంగా వుండి చురకత్తిలా పదునెక్కిందా అనిపిస్తుంది.

"జనారణ్యంలో జనని" శృంఖలాబద్ధమైన స్త్రీ జాతిని మేల్కొలుపుతుంది.

"మృగయా వినోదం" పురుషహంకారాన్ని ప్రస్ఫుటింపజేస్తూ, పురుషజాతి ఆత్మవిమర్శ చేసుకునేదిగా వుంది.

"ఆకలి" యీ కలిలో ఎంత శక్తివంతురాలో తెలుపుతుంది.

అమృతతుల్యమైన కన్నతల్లి ప్రేమానురాగాలను నీటి చలమతో పోల్చిన వైనం అమోఘం.

ఈనాటి యువతరానికి దేశాభిమానం, ఐకమత్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రాముఖ్యతను వక్కాణిస్తూ, సమగ్రత దేశమనుగడకు ఎంత అవసరమో చాటి చెప్పటంలోనూ, నిరక్షరాస్యతతో నిస్తేజమైన నేటి సమాజానికి అక్షరాస్యత ఆవశ్యకతను "అక్షరమంత్రం" ద్వారా బలోపేతం చేయటంలోను, గరళం లాంటి మత్తు ద్రవ్యాలను వధ్యశిలా సదృశాలుగా "కొరకంచు"లోనూ కవి వర్ణించటం అభినందనీయం. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ...

మా మోహనమూర్తి కలంలో నుండి యీ సాహితీ వనంలో ఎన్నో... మరెన్నో సుమాలు సువాసనలు వెదజల్లాలనీ, నటుడిగా విజయ సోపానాలు నిరాఘాటంగా, నిరాటంకంగా అధిరోహించేలా - ఆది మధ్యాంత రహితుడు, కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు - ఆ వేంకటేశ్వర స్వామి కరుణించాలనీ, భవిష్యత్తులో అతని కలం నుండి సమాజాభివృద్ధికి తోడ్పడే ఎన్నో రచనలు జాలువారాలనీ అతని మిత్రునిగా - సహనటునిగా- శ్రేయోభిలాషిగా - నా కాంక్ష - ఆకాంక్ష!

ఈ శుభ సందర్భాన మా మోహనమూర్తిని మనసారా అభినందిస్తూ - నాకంటే వయస్సులో చిన్నవాడు కనక - మన:పూర్వకంగా ఆశీర్వదిస్తూ .....

**ధర్మవరపు రాంగోపాల్**

అధ్యక్షులు

శృతి కళానికేతన్, సంగారెడ్డి

# శుభాకాంక్షలు

గురుతుల్యులు శ్రీ నెమ్మాని మోహనమూర్తి గారు రచించిన అంతర్మథనం లోని కవితలు, గేయాలు నేటి యువతరానికి కళ్ళు తెరిపించే విధంగా వుండి, కుళ్ళును నిర్మూలించేందుకు, దోహదం చేస్తాయనటం సూర్యుడు తూర్పుననే ఉదయిస్తాడనేంత నిజం. "జనారణ్యంలో జననీ" "మృగయా వినోదం" కవితా ఖండికలు మగజాతి దౌష్ట్యాన్ని ఎండగడతాయి. అవి చదువుతుంటే మన మీద మనకే అసహ్యమేస్తుంది.

యువతను జాగృతించి దేశభక్తిని ప్రభోదించి, కన్నతల్లిని గన్న దేశమాత తల్లికన్నా మిన్నయని, దాన్ని రక్షించు కోవలసిన బాధ్యత యువతరంపై వుందని, మావటిగా దురలవాట్ల మదపుటేనుగును అంకుశముతో అదుపులో వుంచుకోవాలనీ, మంచి చేసి పదిమందిని ఆదుకోవాలని, వివిధ శీర్షికల ద్వారా మనల్ని ఉత్తేజపరచటం నిజంగా అభినందనీయం.

ఈనాటి యువతరానికి మార్గదర్శకమయిన కవితల్ని గేయాల్ని "అంతర్మథనం" ద్వారా అంధించిన శ్రీ నెమ్మాని గారు, మంచి నటులు, ప్రయోక్త, వ్యాఖ్యాతగానే కాక కవిగా కూడా పరివర్తన చెంది శృతి కళానికేతన్‌కే గర్వకారణంగా వున్నారు. శ్రీ నెమ్మాని గారు నాకంటే పెద్దవారు గనక వారి సాహచర్యం నా అదృష్టంగా భావిస్తూ శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

**కె. వెంకటేశ్వరరావు**
ఎ.పి.యస్.ఇ.బి.
సంగారెడ్డి.

# నివేదన

ఆవేదనలో నుండి కవిత్వం పుడుతుంది అంటారు. అనుభవంలో నుండి కూడా ఆవిర్భవిస్తుంది కవిత్వం. భావ ప్రాధాన్యత, వస్తు విశిష్టత, రచనకు అందాన్ని చేకూరిస్తే, పాండిత్యం పరిథులు ఏర్పరుస్తుందని నా భావన. మాన్యులనే కాదు, సామాన్యులనూ మెప్పించేది కవిత్వం. ఒక రచనగాని, కవిత్వంగానీ అధికశాతం జనం చదివి అర్థం చేసుకుని, దాన్ని తమకు అన్వయించుకొని బేరీజు వేసుకునే భావనను కలిగింపజేసేది కవిత్వం. అంటే అనుభవాలు అక్షర రూపంగా ఆకృతి దాలిస్తే, ఆ అనుభవం సార్వజనీకం కావాలి.

వచన కవిత్వం వేళ్ళూనుకున్న నేటి సమాజంలో 'కవి' అనేవాడు సమాజాన్ని, వర్గాన్ని ప్రశ్నించటానికే పరిమితం కాకుండా, అనురాగం, ఆప్యాయతలు, దేశభక్తి, కర్తవ్యదృష్టి కలిగించటానికి, వాటిని పెంపొందించటానికి తన ప్రతిభను విస్తరించాలి. స్వాతంత్ర్య కాలం నాటి రచనలు ఒక్కసారి స్ఫురణకు తెచ్చుకుంటే, మన పంథాలో మార్పు, ప్రజల మనుగడలోనూ మార్పు తీసుకురాగల అవకాశం వుంటుంది. దేశమాతను, కన్నతల్లినీ ప్రేమించలేని వారు దేన్నీ ప్రేమించలేరు.

నేటి కలుషిత వాతావరణంలో కక్షలూ, ద్వేషాలూ కొలువు తీరిన తరుణంలో, అకారణ మారణ హోమగుండాలు, ప్రజలే సమిథలుగా మండుతున్న నేపథ్యంలో, మానవాళి మనుగడే ప్రశ్నార్థకమవుతున్న దుర్నిమిషంలో, సామరస్యాన్ని, సౌభ్రాతృత్వాన్ని, మమతానుబంధాలను, న్యాయవర్తనమును పరిరక్షించే రచనలు రావాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. అలాంటి రచనలు ప్రజల జీవన స్రవంతిలో కలిసిపోవాలి. అందుకు ప్రతి రచయిత, కవి నిరంతరం శ్రమించాలి. ఎందుకంటే దేశ సమగ్రతను, కాపాడగలిగేది కత్తులూ, బుల్లెట్లు కాదు కేవలం కలం మాత్రమే. అందుకే కలం కలుషితం కాకూడదు. కరుణామయం, దేశభక్తి పూరితం కావాలి. చైతన్యవంతమై సమాజంలో చేతన తేవాలి. ఎటు విన్నా, కన్నా, హింసారక్త పాతాలే జూలు విదిల్చి వికృత వికటాట్టహాసం చేస్తుంటే, పంజావిసిరి దేశ ఉనికికే చేటు తెస్తుంటే, సగటు మనిషి రక్షణ కరువై-సతమత మవుతున్న దయనీయ పరిస్థితులను పారద్రోలటానికి ప్రతి కవీ, రచయిత పరిక్రమించాలనే ధ్యేయంతో నా వంతు బాధ్యతగా ఈ రచనలు చేశాను.

అయితే యిందులో కవితలతోపాటు రాగయుక్తంగా పాడుకోవటానికి వీలుగా కొన్ని ప్రబోధ గీతాలు కూడా వ్రాయటం జరిగింది. ఇకపోతే ప్రతి వారి మదిలో అనేక రకాల ఆలోచనలు మెదులుతూ ఉంటాయి. కాని అందరికి ఆ భావ ప్రకంపనాలను పట్టి కాగితంపై అక్షరాలుగా పేర్చటానికి అవకాశం రాదు. కొంతమందికి అలా కాగితంపై పరుగెత్తించే పటిమ వున్నా, అవి జన బాహుళ్యానికి చేరువ కాలేక చెత్తబుట్టకో, ఫెంటకుప్పకో అర్పితమై పోతుంటాయి. దీనికి ప్రధాన కారణం ఆర్థిక స్థోమత లేకపోవటం.

నా రచనలకు అలాంటి దుస్థితి కలగకుండా, నా భావాలను పదిమందిలోకి తేవటానికి, పుస్తక రూపంలో మీ అందరి ముందుకు రావటానికి ముఖ్య కారకులు, సదా నా పురోగతికి, ఉన్నతికి, ఆచరణాత్మకమైన సలహాలతో నా కొరకు ఆలోచించే, నాకు చేదోడు వాదోడుగా వుండే నా మిత్రులు శ్రీ ధర్మవరపు రాంగోపాల్, శ్రీ బి. కనకరాజు గారలు. వారి ఔన్నత్యానికి, స్నేహతత్పరతకి ప్రతిఫలం ఏమివ్వగలను? కైమోడ్పులు తప్ప! నిండు మనసుతో వారికి, వారి కుటుంబానికి ఆయురారోగ్యాలు ప్రసాదించమని ఆ భగవంతుని వేడుకొంటున్నాను.

అదే విధంగా తమ అమూల్య సలహా సహకారాలతో నా రచనలు మీ ముందుకు రావటానికి శ్రమించిన శ్రీ బోర్పట్ల హన్మంతాచారి గారికి మన:పూర్వక ప్రణతులు.

నా పుస్తకాన్ని చదివి తమ అమూల్యమైన సందేశాన్నిచ్చిన జనకవి శ్రేష్ఠుడు - తెలుగు గజల్స్ స్రష్ట, విజ్ఞాన ధునీ, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్ డా॥సి. నారాయణరెడ్డి గారికి శతసహస్ర వందనాలు.

అంతర్మథనానికి సందేశమివ్వాలని అడిగిన వెంటనే ఆత్మీయతతో వెన్నుతట్టి ప్రోత్సహించి "అభినందించిన" మా బ్యాంకు అధ్యక్షులు, యువకులు, సౌభ్రాతృత్వానికి మారుపేరు, ఆప్యాయతల సెలయేరు శ్రీ జి. ఎలక్షన్ రెడ్డి గార్కి విధేయతా వినమ్రుడను. స్నేహశీలి, ఎదుటివారిని నొప్పించని సున్నిత మనస్కుడు, అలుపెరుగని నిరంతర శ్రమైక జీవి, నిరాడంబరుడు, డి.పి.ఆర్.ఓ. శ్రీ జి. సన్యాసిరావు గారు నాకు అందించిన సహాయ సహకారాలకు విలువ కట్టలేను - హృదయ పూర్వకంగా అంజలి ఘటించటం తప్ప.

ఇక నా ఊహలకు తన కుంచెతో అందమైన రూపు నిచ్చి, ఆకట్టుకునే విధంగా ముఖపత్ర చిత్ర రచన చేసి నా పుస్తకం సొగసును యినుమడింప జేసిన ఆర్టిస్ట్ శ్రీ గంగాధర్ (హైద్రాబాద్) గార్కి నమస్సులు. అతి తక్కువ వ్యవధిలో నా పుస్తకాన్ని అనుకున్న దానికంటే అందంగా ముద్రించి, నా కలలకు, కళలకు ఆకృతి నిచ్చిన మెస్సర్స్ సూరజ్ ప్రింటర్స్ అండ్ ప్యాకేజర్స్ (హైదరాబాదు) వారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతాభివందనాలు అర్పించుకుంటూ, మిత్రులకు, శ్రేయోభిలాషులకు వెన్నుతట్టి ప్రోత్సహించిన ఆత్మీయులకు పేరు పేరున అభివందనాలు!

నెమ్మాని మోహనమూర్తి

# అంకితం



నా కావ్య భర్త
శ్రీ షిర్డి సాయినాథ భగవాన్
పాధపద్మాలకు
భక్తితో

- నెమ్మాని.

# స్తోత్రం

గజముఖ వరదా గణపతి శరణం
గణాధిపా మాకొసగుము విజయం ॥గజ॥

పార్వతి తనయా పవిత్ర చరితా
పాపహంతకా ప్రణతుల గొనుమా ॥గజ॥

సర్వకార్యముల సాధన కొరకు
ఆదిపూజ మరి నీదే కాదా ॥గజ॥

అవిఘ్నమని నిను మదిని తలచినా
భగ్నము కావా బాధల బరువులు ॥గజ॥

తల్లి ఆజ్ఞను ఔదలదాల్చి
పరమ శివుని ఎదురించిన వీరా ॥గజ॥

సకల జనావళి హృదయమందున
సదా నిలిచి కాపాడు దైవమా ॥గజ॥



# అమ్మ!

అమ్మ అన్నదీ అమృత పెన్నిధి
అమ్మ ముందు కడలి ఎంతో చిన్నది
కమ్మనైనా అమ్మ ప్రేమ తరగనిది
కోట్లు గుమ్మరించినా అంగట్లో దొరకనది ॥అమ్మ॥

తల్లికన్న దైవమేది లోకంలో
మాతకన్న మధురమేది యీ మహిలో
చల్లని జాబిల్లి కాంతి మిలమిలలూ
అమ్మమనసు వెలుగు ముందు వెలవెలలూ
అమ్మరూపు అపురూపం నిండివుంది యీ జగం
మమత ఎంత పంచినా సుధలూరే చలమ ॥అమ్మ॥

కడుపున తామోసి కరుణతొ లాలించి
రోత మరిచి సేవచేసి అనురాగం పంచే
ఆ దైవం కోరుకోదు ప్రతిఫలం
మన వైభవమే ఆమెకు ప్రాణప్రదం
అమ్మరూపు అపురూపం నిండివుంది యీజగం
మమత ఎంత పంచినా సుధలూరే చలమ ॥అమ్మ॥

కన్నబిడ్డ ఏడిస్తే అమ్మ మనసు కల్లోలం
ఆ బుడతే అడుగులేస్తే చెప్పలేని ఆనందం
తనువు తెలివి చెమట చేసి పెంచునూ
అమ్మా అని పిలిచినంత పులకరించి పోవునూ
అమ్మరూపు అపురూపం నిండివుంది యీజగం
మమత ఎంతపంచినా సుధలూరే చలమ ॥అమ్మ॥

అలవికాని బాధలో ప్రమాదాల వేళలలో
అనూహ్యంగ నోటినుండి వెలువడు శబ్దం అమ్మా
అమ్మను మించినది ఏది యీ యిల
అమ్మను కాదనువాడు మనిషి కాదు శిల
అమ్మరూపు అపురూపం నిండివుంది యీజగం
మమత ఎంత పంచినా సుధలూరే చలమ ॥అమ్మ॥

# ఈనాటి భారతం

భారతీ నీకెన్ని బాధలొచ్చాయమ్మ
నిన్ను చూస్తే గుండె గునపాలు దిగునమ్మ
విచ్చు కత్తుల గుచ్చి  పిచ్చినవ్వా నవ్వి
పచ్చనీ దేశాన చిచ్చు రగిలించిరి

జారులు చోరులు హీరోలు యీనాడు
కత్తులూ నెత్తురులు మేల్కొల్పు పాడు
నీతి న్యాయము వట్టి నీటి మూటాయె
మాత కంటను రక్త కన్నీరు గారే ....

ప్రతివాడు నీ యెదలో ములుకులూ నాటిరి
శృతి తప్పి దుర్మార్గ వీణియను మీటిరి
చల్లనీ దేశము భగభగా రగిలెను
విస్ఫోటనల హోమ గుండమై మండెను

ప్రతివాడు నిలబెట్టి నిన్ను దోచే వాడే
విలువైన అంగముల నమ్మజూపే వాడే
యింటిలో ఎలుకలని యిల్లు కాల్చేవాడే
నీ వొళ్ళు నిర్దయగ గుల్ల చేసేవాడే

అడ్డదారుల బడి ఆర్జించిరీ ధనము
దొడ్డ గుణముల వీడి గడ్డికరిచే జనము
నల్ల ధనమంతయూ ఎల్ల దాటించిరి
గుల్ల చేసిరి యిల్లు డొల్లగా మార్చిరి

ఓట్ల కోసం కోట్ల ఆటలను నేర్చిరి
సీట్ల కొట్లాటలో సిగపట్లు మరిగిరి
చట్ట సభలూ మారె ముష్టియుద్ధాలబరి
బీటలూ బారెను సమసమాజపు మడి

సంస్కృతిని కాపాడు మతము యీనాడు
మానవుల తెగటార్చు మరఫిరంగీ గుండు
దేవుడిని సైతమూ వదలిపెట్టని పీడ
కలుషితము పాలైన రాజకీయపు చీడ

పరదేశ తొత్తులై బాంబులను పేల్చిరి
విగత జీవుల చూసి విరగబడీ నవ్విరి
మానవాదేహములు శకలాలుగా మారి
క్షతగాత్ర రోదనల దద్దరిల్లెను ధరణి

తుంటరీ తనయులూ గుంటనక్కల తీరు
యింటి గుట్టును వీధి నమ్మజూపారు
తింటారు నీ తిండి పెరిగెదరు నీ వాడి
శత్రురాజ్యమే వారి చిలుకపలుకుల బడి

ఉగ్రవాదము నేడు వూపిరిగ మిగిలెను
భద్రతా లోపించి బతుకీడ్చుటాయెను
మానవులే బాంబులై మానవత్వము మరిచి
మహనీయులను చంపు మైకమున మునిగిరి

తిన్నింటి వాసాలు గణియించే ధూర్తులు
వంటబట్టెను నీచ ముష్కరపు నీతులు
తనవ్రేల తనకన్ను పొడిపించే రీతులు
పందికొక్కుల తీరు తీసిరే గోతులు

గాంధీజీ సూక్తులు మరిచింది లోకం
నెహ్రూజీ ఆశయం చెదిరినా స్వప్నం
నేతాజీ నేతృత్వ పటిమ మాసిన వేళ
భయకంపితము చేసే గుడ్ల గూబల మేళ

భానునీ తేజము అలనాటి భారతం
గ్రహణ పరిపీడితం మ్లేచ్ఛవశభారతం
భావి ఆశల ప్రోది స్వాతంత్ర్య భారతం
కల్లోల సాగరం యీనాటి భారతం!



# జనారణ్యంలో జననీ!

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతా"

మధురమైన ప్రవచనం - మరపురాదు ఏ దినం
ఆచరణలో అతి దూరం - అందమైన ఆత్మద్రోహం!

ధాన్యానికి మాన్యానికి - ధనానికి సహనానికి
సకల సంపదలకి సర్వ శక్తుల సముపార్జనకి

అధిదేవత ముదిత సృష్టికి మూలం వనిత
అవసరం తీరాక అథకత్తెరలో వక్క!

తలవున్నా ఎత్తలేని దౌర్బల్యవైకల్యం
తెలివివున్నా తెల్లవారదనేది తేటతెల్లం

ఆరిటాకై, వెలుగును పంచే కొవ్వొత్తై
ఆజ్యమై అగ్ని హోత్రుడికి ఆహుతై

ఒక్కడుగు ముందుకు పడితే
వందడుగులు వెనక్కు లాగేయబడుతూ -

అందచెలంచెలుగా దిగజారింది
ఆర్ద్రయై మూగగా రోదించింది !

అధికారానికి అలవాటు పడ్డ ప్రాణం
అజమాయిషే అర్హతనే స్వభావం

బలిసి పెట్రేగి పంకిలమయ్యింది
పురుషహంకారం పంజా విసిరింది !

## జననీ!

పులి కనిపించినా పంజా కనుపించని వైనం
తరాలు మారినా తలరాతలు యధాతథం!

అండదశనుంచే ఆమెకు నేస్తాలు కన్నీళ్ళు
అవి దిగమింగి బయటపడగానే కట్టుళ్ళు!

గర్భంలో ఆకారం కూడా దాల్చని
పిండానికి పిండాకూడు పెట్టింది !

ఆడతనాన్ని అదుపాజ్ఞల్లో పెట్టాలని
పథకాలను రచించింది పురుషత్వం !

ఆడజన్మ ఎత్తాలంటేనే అదిరిపడుతోంది పిండం
ఆ మాంసపు గుడ్డుకు ఉదరంలోనే వుంది గండం !

ధైర్యంచేసో దైవ సంకల్ప బలంతోనో
ధరణి మీదకు దర్జాగా తరలివస్తే

బాలారిష్టాలు భయంగొల్పే నిబంధనలు
భద్రత అనే ముసుగులో బానిసత్వపు ఛాయలు!

కలకంఠి కంట కన్నీరే కొందరి ధనాగారం
పరాన్న భుక్కుల పటాటోప జీవన సారం!

సిగ్గుతో కర్కశత్వం తలదించుకుంది
లజ్జకే లజ్జేసి కుళ్ళికుళ్లి రోదించింది!

తమ పరువు పటాపంచలవుతుందనే భయం
నీతి బోధలతో కుంచిస్తారు పసి హృదయం!

బూచిని భూతద్దంలో చూపిస్తారు
తోచిన పతివ్రతల కథలు వల్లిస్తారు!

నెమ్మాని

వారికి తెలియకుండానే చుట్టూపరిధులు
అభేద్యమైన చట్రాలలో వారు సదా విరథులు!

కట్టుబాట్లు కానరాని మగపురుషుని జీవితం
ఆటుపోట్లు ఆడదాని ఆరాధ్యదైవం!

పిండారిష్టాల చీడపీడల గడచి
బాల్య వివక్షతల నుండి బయటపడి

కన్నెగా ఎదిగి వధువుగా మారి
వన్నె వన్నెల జీవితాన్ని ఊహిస్తూ

పుట్టిల్లు వదలి మెట్టిల్లు మెట్లెక్కుతూ
వూహించదు అది మానవ పులి గుయ్యారమని!

కాళ్ళపారాణి ఆరదు
కట్న దాహం తీరదు!

ఊహల జీవితానికి ఉరుల ఉచ్చులు
కన్నతల్లి కడుపులో ఆరని చిచ్చులు!

మీసమున్న ప్రతివాడు బాసైనాడు
దోసమేమని స్త్రీజాతిని ఛిన్నాభిన్నం చేస్తున్నాడు?

విత్తు ఎంత విలువైనా విరగదీసేదైనా
ఎత్తైన మొక్కగా ఎదగాలంటే మాన్యం మాననీయం!

కరెంటు బల్బు వెలగాలంటే
నెగిటివ్ పాజిటివ్ నెసెసరీ!

కాలగమన చక్రానికి
దివారాత్రాలు కంపల్సరీ!

మానవ సహజీవన గమనానికి
సహచర్య భాగస్వామ్యానికి ఆడామగ సరాసరి!

అది మరచింది పురుషత్వం తోడేలై పొంచింది
ఆడతనమనే మేక మెడను నోట కరచింది

అస్థిత్వం ఆవిరై వ్యక్తిత్వం గోడకేసిన వెల్లయై
కళ్ళగంతలతో సహజీవనం సాగించిన గాంధారి!

కాకికి పండులా రుచించే ఎద్దుపుండువు నీవు
సర్వం దోచబడి చాక్లెట్‌తో బుజ్జగింపబడ్డున్నావు!

బ్రద్దలై భస్మం చేయక కోమాలో మ్రగ్గిన అగ్నిపర్వతమా
విస్ఫోటించి విలయమై విప్లవించి శృంఖలాలు త్రెంచుమా!

బడబానలాన్ని హృదిలో దాచిన సాగరమా
నీవే గనక విజృంభిస్తే మనగలుగుట మగతరమా?

కార్యేషు దాసివై సేవలకే కాబోకు అంకితం
రంభలా సుఖాలివ్వటానికేనా పరిమితం!

కొట్టినా కాల్చినా క్షమతో కాబోకు నిర్వీర్యం
సలహా మంత్రిదైనా రాజుమాటే శిరోధార్యం!

భోజ్యేషుమాతవై మగకండల్ని పెంచిపోషిస్తే
కావరంతో నీమీదకే తిరగబడ్డాయి పిడిగ్రుద్దులై!

రూపేచ లక్ష్మివై రమింపజేయాలని ఒకసారి
రూపవతీ భార్యాశత్రువని మరి యింకొకసారి!

తమ అవసరాలకు అనుగుణంగా అచ్చొత్తుకున్నారు
కులపత్నిని షట్బంధన పంజరాల్లో బజ్జో పెడ్తున్నారు!

నీ సుగుణాలే నీ మీదకు శరాలై
క్షతగాత్రను చేసి చెమర్చుతాయి

ఆత్మన్యూనతతో కావద్దు అగ్నిని చుట్టే శలభం
ఆత్మాభిమానం అభాసైతే ఆత్మహత్యా సదృశ్యం!

బాంధవ్యాలకు ప్రలోభించకు
ఛాందసత్వాన్ని ఉపేక్షించకు!

విజ్ఞాన హీనతే దీనికి ముఖ్యకారణం
విద్యతో బలోపేతం చేసుకో హృదయాంగణం!

నీ దర్జాను ధనాధిపత్యం తూట్లు పొడిచింది
ఆర్థిక అసమానత కాళ్ళు పట్టి అగాధంలోకి లాగింది !

అన్నింటికి మగవారిపై ఆధారపడమంది
అరచేతిలో బెల్లంపెట్టి మోచేతిని నాకించింది

జనారణ్యంలో జన్మప్రదాత జననీ
జయం నీదేనని తిరగరాయాలి చరిత్రనీ!

మహిళా! ఊర్మిళా సుషుప్తిని వీడి మేలుకో
ఉషస్సులో ఉజ్వలతను సంతరించుకో!

స్వేచ్ఛకై నినదించు-నిలకడగా వుద్యమించు
గగనమై గర్జించు - ఛండికవై పరిక్రమించు!

పురుష పక్షపాతాన్ని పరిహరించు
మహిషాసుర మర్దినివై దౌర్జన్యాన్ని నిర్జించు!

అబలవనే పిరికి వాదానికి నూకలు చెల్లించు
సబలవై పోరాట పథాన నీ పయనాన్ని మళ్ళించు!

రమవై రాణించు - భారతివై భాసించు
ఉమవై ఉద్యమించు - శక్తివై శాసించు!

అలుపెరుగకు అతివ! గెలుపే ముఖ్యం ముదిత!
జయీభవ జననీ! దిగ్విజయీభవ తరుణీ!

# పొగడ్త

పొగడ్తా! విశ్వంబున తిరుగులేని అగడ్తా!

ప్రాణమున్న ప్రతి జీవిని పరవశింపజేస్తావు
తన వునికిని మరచిపోవ పులకరింపజేస్తావు
ఎంతటి మహనీయునైనా నిలువున ఓడిస్తావు
ముక్కంటిని సైతమూ మురిపింపగ జేస్తావు ॥పొగడ్తా॥

భగవంతుడు నీ మాయకు వరదానాలిస్తాడు
భక్తుడు ఆ భగవంతుని మోసగింపజూస్తాడు
భట్రాజై నీ పనుపున బతుకును గడిపేస్తాడు
భజనపరుడు నీ శక్తితో పదవులనెక్కేస్తాడు ॥పొగడ్తా॥

నీవంటే పడదంటూ బీరాలు పలుకుతారు
నిజమాలోచన చేస్తే నీవంటేనే హుషారు
నిక్కముగా ప్రతివాడు ముమ్మాటికి నీనౌకరు
నీవులేని ప్రతిక్షణం చెలరేగును బేజారు ॥పొగడ్తా॥

నానా నామములతోడ విలసిల్లే నెరజాణ
కాకా రాయుళ్ళకు ప్రియమైన ప్రేమాంగన
బాకా బాబుల పాలిటి చిరునవ్వుల చిత్రాంగన
చెంచాలను చేరదీసి మురిపించే ముగ్ధానన ॥పొగడ్తా॥

జగతిలోన ఘనమైనా చరిత వున్న ఘనాపాటీ
తారతమ్యములు లేని యిల నీకెవ్వరు పోటీ
నిను నమ్మిన నీవారిని గట్టుజేర్చు ఓ మేటీ
సుఖ భోగాలను గూర్చెడు కామధేను నీ సాటీ

పొగడ్తా! విశ్వంబున తిరుగులేని అగడ్తా!



# ఊహా సుందరి

నాకలల రూపమా -
నా బ్రతుకున కర్థమా!
కావ్య కథానాయికల
కలబోసిన అందమా!

ఊహల ఉయ్యాలలో వూగించుట న్యాయమా?
నీ తలపుల తరంగాల తేలించుట ధర్మమా?
ఊహల వుచ్చుల నుండి ఎప్పటికీ విముక్తి?
ఆలోచన అలలనుండి ఏనాడు తీరానికి ?
నీ కొరకై వేచిచూసి, నిరీక్షించి, నీరసించి
కనులు మూత పడగానే కనుల ముందు మెరిసేటి ॥నా కలల॥

మధురమైన నీ వూసులు వీనులకు విందులు
నీ అధరామృత సుధలు సంజీవని సమంబులు
నీ సాంగత్యం నాకు ఇంద్రలోక సమానం
నీవులేని ప్రతి నిమిషం కర్కశ నరకప్రాయం
నీ కొరకై నిత్యజపము తపము చేసి శుష్కించి
కనులు మూతపడగానే కనుల ముందు మెరిసేటి ॥నా కలల॥

నీ సుకుమారము చూసిన మరుమల్లియ తెల్లబోయే
నీ నడకల హొయలు గన్న మయూరము చిన్నబోయే
అందానికి అందమా - గగనమందు చంద్రమా
ఆమనిలా అరుదెంచి పులకరింపచేయుమా
చకోరమై ఎదురు చూసి అలసిపోయి సొమ్మసిల్లి
కనులు మూతపడగానే కనులముందు మెరిసేటి ॥నా కలల॥



# ఆమని

కోకిల రాగాలు తీసే నవ చిగురులు విరియగ
వనమయూరి పురివిప్పెను హరిత వర్ణమలరగ
వసంతలక్ష్మి హొయలు పోవ గునగున నడయాడగ
నవశోభలు ప్రతిహృదిలో కువకవలూ తీయ గ ॥కోకిల॥

నేత చీర అందాలతో మురిసిందీ ప్రతి తరువు
కనువిందుల సింగారపు సిగ్గుల నవ వధువు
పేరంటానికి తరలిన కిన్నెర ముత్తైదువు
పెందలాడే తలస్నానపు ముచ్చటైన చిత్తరువు
ఏమని చెప్పనూ .... ఎంతని వర్ణించనూ
ఆమని అద్భుత సొగసులు గిలిగింతలు పెట్టగా ॥కోకిల॥

రైతన్నల శ్రమఫలితం కనులముందు నిలువగా
ప్రతి యిల్లూ ధాన్యలక్ష్మి అవతారము దాల్చగా
శుభకామన మధురోహల ప్రకృతి పులకించగా
మకర సంక్రాంతి లక్ష్మి పరుగున ఏతెంచగా
ఏమని చెప్పనూ... ఎంతని వర్ణించనూ
ఆమని అద్భుత సొగసులు గిలిగింతలు పెట్టగా ॥కోకిల॥



## నీరాజనాలు

నీతి మాటలు ...
నీటి మూటలు కాకుండా ...
నిజమైన చేతలైన నాడు ...
నిఖిల జగతి ....
నీరాజనాలు !



## మధూహ!

కలకనిపించిన కమనీయ రూపమా
కన్నుల వెలుగును నింపిన తేజమా
కల కరిగించకే వెలుగార్పేయకే
ఈ పేద హృదయం నీకే అంకితం! ||కల||

నీమది వీణను మీటాలనీ
సుశ్రుతి బ్రతుకున విరియాలనీ
సరాగాలు పలికిన సరిగమలూ
చెరగని ఆనందలయ హొయలూ
వేణువై-విపంచివై-నాదమువై-నిస్వనమై
నన్నేలవే నా భావగీతమై..... ||కల||

వెదురు కర్రను వేణువుగా మార్చి
రాగాలు పలికించు మోవిని జేర్చి
మధుర స్వరాల మానినీ
కోకిలరావాల ఆమనీ
మోహనవై-కల్యాణివై-హరివిల్లువై-కలహంసవై
నను మురిపించవే నా మధు గీతికవై..... ||కల||

# మృగయా వినోదం

ఓ మగాడా! ఓ మగడా!

ఆలి అనేది అంగట్లో సరుకు కాదు
భార్యలంటే యిలబానిసలు కాదు.

నువ్వాడుకునే బంతి కూడా కాదు.
నీ ఖుషీకి కాల్చిపారేసే సిగరెట్టూకాదు.

నీలాంటి మనిషే బాబూ మీ ఆవిడ
నింపుకుంది మదినిండా అనురక్తి నీ ఎడ

ఆధునిక సమాజంలో ఆడపిల్ల పుట్టిందంటే
అష్టగ్రహ కూటమి వచ్చినంత జడుపు

విజ్ఞాన విశ్వంలో వనిత జననం
స్కైలాబ్ మీద పడ్డంత వెరపు.

ఆడపిల్ల కన్నతండ్రి కాళ్ళకు బలపాలు
గుండె కుంపటి దించుకునే తాపత్రయాలు.

కట్నకానుకలకు రూకల రాసులు
కూడబెట్టలేక అమ్మా నాన్నలు హతాశులు

వెతగ్గా వెతగ్గా ఎదురౌతాడో మగాడు,
అతని రేటు మాత్రం చుక్కల్ని ముద్దాడు.

వంశంలో అటూయిటూ ఏడుతరాలు కొనని
వస్తుసముదాయాల మహజరు అందిస్తాడు.

అడిగేవాడికి అర్పించుకునేవాడు లోకువ
చెప్పేవాడికి వినేవాడు వెధవ

పొట్టకోస్తే అక్షరం ముక్క రాకపోనీ
ప్రొద్దున చూస్తే రాత్రికి కల్లోకొచ్చే ఆకారం గానీ

చూస్తే ఎటుచూస్తున్నాడో మనకు తెలియకపోనీ
ఒకటిన్నర కాలుతో గెంతుతూ నడవనీ-

తారు డబ్బాలా వొళ్ళు తళతళ మెరవనీ-
నవ్వకున్నా నవ్వినట్లు పల్వరుస బయటేవుండనీ-

అయినా వాడికి మాత్రం పిల్లనచ్చాలి.
అపరంజిలా మిసిమి రంగులో వుండాలి.

పెళ్ళిచూపుల ల్యాబ్‌లో శల్యపరీక్షలు
బాసిజం అక్కడనుండే మొదలు

నడవమంటారు నవ్వమంటారు.
పాడమంటారు-ప్రశ్నలతో ప్రాణాలు తీస్తారు.

గుడ్డుపైన వెంట్రుకలేరాలని ప్రయత్నిస్తారు.
శాడిజంతో వెర్రి ఆనందం అనుభవిస్తారు.

ఆడపిల్లను కన్నపాపానికి వేరగాడిలా
కుక్కినపేనులా, గంగిరెద్దులా

మగపెళ్ళివారి డిమాండ్లకు
తలాతోకాడిస్తాడు-తలతాకట్టు పెడ్తాడు!

లేకుంటే ఆ పిల్ల పెళ్ళికాదేమోనని భయం,
కాకుంటే సూటిపోట్లతో దేహం గాయం

వెయ్యి అబద్ధాలాడి ఒకపెళ్ళి చేయాలని
వేగిరపడి వేయిస్తారు మెడలో పసుపుతాడు

ఆ త్రాడు అనుబంధమైతే ప్రమోదం
ఉరై బిగిస్తే స్త్రీ ఉనికికే ప్రమాదం

బొమ్మా బొరుసా జూదం ఆడదాని జీవితం
బొడిపికట్టే బొరుసే అధికశాతం

పడతి బతుకు పరమపద సోపానపటం
గడిగడికో పాము కాటెయ్యాలని చూట్టం

పెళ్ళికీ పెద్దపాముకీ పెద్దతేడాలేదు
హాళ్ళికిహాళ్ళే-అంతకుమించి ఏమీ మిగలదు.

దాన్ని ఏ అదృష్టవంతురాలో తప్పించుకుంటుంది
దగాపడే వాళ్ళే నూటికి తొంబయిమంది

పితృ స్వామ్యంలో ప్రతిక్షణం మగమదం
జూలు విదిల్చే గాండ్రించే క్రూరమృగం

మగువల జీవితాలు మానవ కబేళాలు
యిరుసిరిగిన బండిలో యింతుల ప్రయాణాలు

మగువ యింటికి దీపం కంటికి తేజం
ఆప్యాయతల మాత దేహమొసగు దేవత

సిరులనిచ్చులక్ష్మి సుఖములపంచు చెలి
నీవంశాభివృద్ధికి క్షేత్రం బతుకు దారి చూపేనేత్రం.

ఆలి నీ దేహంలో కాదా అర్ధభాగం
అది మరచి చేసుకోకు ఆత్మద్రోహం

నీదేహంలో కుడిఎడమల ఎడం చేయగలవా?
కుడిని కుడువబెట్టి ఎడమను ఏడ్పిస్తావా?

త్రికరణ శుద్ధిగా నీకంకితమవుతుంది గదా
మనస్కరించకున్నా నీ కోర్కెలు తీరుస్తుంది గదా

జననినీ జన్మభూమినీ వదులుకుంటుంది గదా
నిన్ను నమ్మి తనను నీకమ్ముకుంటుంది గదా

కోరిన కట్నం కొంగున ముడేసుకొస్తుంది గదా
నిజం చెప్పాలంటే నిన్ను కొంటుంది గదా

పశువును కొంటే గొడ్డుచాకిరీ చేస్తుంది
వస్తువునుకొంటే మన అవసరం తీరుస్తుంది

కాని ఆమె ఎడ మకతికగా తయారైంది
డబ్బిచ్చి తద్దినాన్ని కొని తెచ్చుకొంది

నీ వెంటబడి వెంటాడి యిల్లాలయితే
తన నమ్మకమనే అమ్ముతో తానే వేటాడబడుతుంది.

యిచ్చిపుచ్చుకునే గౌరవం తానిచ్చింది.
నీ నుంచి పుచ్చుకుందామంటే పుచ్చి పురుగులైంది.

తప్పని తెలిసికూడా తప్పుకుపోతే ఎలా?
తిప్పలన్నీ ఆమెకూ-గొప్పల కుప్పలన్నీ నీకా?

తప్పుని తప్పని తెలుసుకొంటే మంచిది
మూర్ఖంగా మొండికేస్తే జరుగుతుంది జరగరానిది

తలతిక్కగా ప్రవర్తిస్తే కథడ్డం తిరుగుతుంది.
చరిత్ర పునరావృతమై గుణపాఠం నేర్పుతుంది.

నీకు బదులు తాను దాసియై
నీ ఉన్నతికి తాను ఊతమై

నీ అవసరాలు తీర్చే యంత్రమై
నీ గొంతుకు తాను గాత్రమై

కొండంత ఆశతో నీదరికి వస్తే
అండగా వుండాల్సింది పోయి

బండబారిన హృదయ శిలవై
గుండె కోతను మిగులుస్తావా?

మానవత్వాన్ని మరుగుపర్చి
తుంటరివై మంటల్లో మాడ్చేస్తావా?

నాతి చరామి-నాతి చరితవ్య అనే బాసను
అడియాస చేసి ఆ బాసతోబాటు ఖననం చేస్తావా?

మగాడా! మగని అవతారం దాల్చి
మగువ మనసును మసి చేయకు!

మగాడిననే జడత్వాన్ని వీడి
మనిషిగా నీ పత్నిని గుర్తించు!

దురంతాలు దూరంచేయి
దురాచారాలను దునిమేసేయి!

పాలలాంటి పరువాల బొమ్మను
నీరువై నీలోన కలిపేసుకో!

నీరును పాలనువేరుచేసే
రాయంచల పాలబడకుండా కాపాడుకో!

నీ అర్థభాగాన్ని ఆత్మీయతతో అక్కునజేర్చు
ఆమె! జీవితనేస్తం-స్నేహ హస్తం అందించు!

నీ పత్నికి నిజమైన పతిగా నిలబడు
పరస్పర అనురాగంతో అడుగిడు!

తరుణి ప్రాణాలతో ఆడకు చెడుగుడు
అవస్థల పాలై జీవితాలు తడబడు!

చేసుకున్న వాడికి చేసుకున్నంత మహదేవా!
చేసుకున్న భార్యను గౌరవించు మహానుభావా!

## దైవత్వం

దేవుడెక్కడా అని
దేవులాటెందుకు?
దెబ్బలాటెందుకు?
ధర్మమార్గము-దయాగుణము
దైవత్వాన్ని దత్తం చేయవా?



## అశనిపాతం

మతం కావాలి-మానవులకు హితం!
మకిలి మౌఢ్యానికి-మరి చేయొద్దు అంకితం!
మత మనేది-వ్యక్తి గతం!
మారకూడదది-మసిచేసే అశనిపాతం!!



## మృగతృష్ణ

అద్దం అబద్ధం చెప్పదు-నిజనిర్ధారణలో నిజముండదు
పాలపుంతలో పాలుండవు-నేతిబీరలో నేయుండదు

బొగ్గుపులుసు గాలిలో బొగ్గుండదు-లోచికన్నా దరిద్రంవుండదు
రాజకీయంలో నీతుండదు-నేతలకు ప్రజలపై ప్రేముండదు

స్వార్థంలేని భక్తి వుండదు-దైవానికి వివక్షత వుండదు
కన్నతల్లి ప్రేమలో కల్మషముండదు-
స్నేహాన్ని మించిన అనుబంధముండదు!

## చెలి(మి)

అవనిలోన మరువలేని మధురమైన ఈహం
నిత్యాస్వాదనతో కూడ తీరదు ఆ దాహం
పులకరింపజేసేటి రమ్యమైన ఆ ఊహం
కహ్లారపు శోభమయం అది నిండిన ఇహం
వ్యూహాలు, ద్రోహాలు చేయలేవు గ్రాహం
మహంతులైనా సరే దానిముందు దాసోహం
దానిని పొందాలంటే విడవాలి అహం
నిత్యం నిలపాలంటే శ్రమించాలి అహరహం
అదేకదా జగమందున అందమైన స్నేహం
మర్మరహిత చెలిమనేది ఆ దేవుని అనుగ్రహం!



## మనీషి

మనసు, మాట, నడత మనిషికి ఒకటైన
మనిషికాడు అతడు, మహితుడౌను
మనసు, మాట, నడత మరివేరువేరైన
మనిషికాడు వాడు మృగమె కాని!



# కప్పలు

బహుపరాక్ మిత్రులారా! బహుపరాక్-బహుపరాక్!
బంధువులా ఆదరణలో కరిగే కొవ్వొత్తులారా...

అతిథులమని వస్తారు-మన ఆర్జన మెక్కుతారు
ఎగతాళీ చేస్తారు-ఎదములుకులు నాటుతారు
ఎకసక్కెము లాడుతూ-కలతను మది నింపుతారు
మధురమైన బంధాన్ని-మత్సరాన త్రుంచుతారు.
ఏనాడు మన ప్రగతికి-సాయపడని బంధువులు
రక్తబంధమును మరిచే-రాక్షస ప్రవృత్తులు...

మొగమాటం మంచితనం-అశక్తిగా భావించి
అడుగడుగున కించమైన-మాటలతో నొప్పించి
మనయందు మదినిండా-మత్సరమును నింపుకొని
హాస్యపు మాటల మాటున-అపహాస్యం పాల్జేసి
ఆనందించే అతిథులు-నంగనాచి వంచకులు
వరద తాకిడికి చేరే-చెరువు నిండు కప్పలు....

మాటసాయము చేసే-మనుషులే మన బంధువులు
అవసరాన ఆదుకొనే-ఉదారులే మన అతిథులు
ఆధిక్యము మదినెంచని-ఉన్నతులే చుట్టాలు
మర్యాదల కాశపడని-మహితులే మన అప్తులు
కౌటిల్యం కానరాని-పేదలైనా సరే ఉత్తములు
పరువు నిలిపి, కలిసి-మసలే దేవతా స్వరూపులు





నెమ్మాని

# అక్షర మంత్రం

తూరుపునా సూర్యోదయం
చీకటి తెరలూ మటుమాయం
అక్షరమూ నువునేర్చిన క్షణము
విజ్ఞానానికి అది సంకేతము ॥తూ॥

చదువులేనీ ప్రతిజీవితము
ఉప్పుకారంలేని వంటకము
విద్యలేని ప్రతి సంసారం
చౌడు భూమిలా నిస్సారం
చదువు విలువను విద్యచలువను
కనుగొని దిద్దుకో నీ జీవన గమనం ॥తూ॥

చదువు అబ్బుట కాదు కష్టము
మనసుంటే అది సులభ సాధ్యము
వ్రేలిముద్రలకు స్వస్తిపలుకుము
వెంటనే నేర్చుకో సంతకము
చదువుతోడ నీ విలువపెంచుకో
వినయమునూ నీ సొంతం చేసుకో ॥తూ॥

అక్షరమన్నది దైవసమానము
నిరక్షరాస్యత రాక్షసత్వము
వెలుగులు నింపును అక్షర దీపం
తొలగించును అజ్ఞాన తిమిరము
శుభములనొసగే అక్షరము
విలువలు పెంచే తారక మంత్రం ॥తూ॥



# పతనం!

మధ్యపాన వధ్యశిలకు దూరంగా వుండండీ
ఊపిరోసి ఉద్యమాన్ని ఉన్నతంగా తీర్చండీ ॥మద్య॥

మత్తుపానమనేది సామాజిక పతనమనీ
కళకళలాడే బతుకును కంగాళీ చేయుననీ
కాలరాచి పిప్పిచేసి కాటిపాలు చేయుననీ
చేతులు కాలక ముందే బతుకు విలువ తెలుసుకొనీ ॥మద్య॥

ముద్దులొలుకు పిల్లలనూ ముత్యమంటి యిల్లాలినీ
మద్యపాన మహమ్మారికి బలిచేయకూడదనీ
రెక్కల కష్టాన్నంతా తన్నుకుపోయే గ్రద్దనీ
దీపముండగానే యిల్లు చక్కదిద్దుకోవాలనీ ॥మద్య॥

అనర్థాలకు మూలం మద్యపాన వ్యసనమనీ
అప్పులపాలూ చేసి అగాధంలో ముంచుననీ
అయినవారి కందరికీ అలుసై పోతావనీ
ఆ విషయం గమనించీ మద్యం మానేయమనీ ॥మద్య॥



# పరమార్థం!

మానవజన్మకు పరమార్థం మహోజ్వల అక్షరం
అది నూతన తేజం-నవజీవన వేదం!

విద్యలేని మానవుడు మానవుడే కాదంట
వింతయైన పశువంటూ పెద్దలు చెపినారంట
విద్య నేర్చుకుందాము విజ్ఞానము పొందుదాము
వయోజన పాఠశాల మనపాలిటి ఆలయము

వినయమును అందించు వివేకము కల్గించు
మోసాలను గమనించే తెలివితేటలనిచ్చు
విద్య విలువ తెల్సుకో-ఈ నాడే మేలుకో
ముచ్చటగా అక్షరమును ఈ రోజే నేర్చుకో

వేలిముద్ర నీ బతుకుకు కనుపించని శాపము
వెలుగు నింపు జీవితాన విద్య చిరుదీపము
పలకా బలపము అందుకో అఆ ఇఈ దిద్దుకో
సంతోషము మదినిండగ సంతకమును నేర్చుకో

వయసూ మతమూ చదువుకు ఆటంకము కాదంట
చదువులేని ఆ బతుకు దినదినమూ ఒక తంటా
చదువూ చదివించూ ఈ సంఘాన్ని ఉద్ధరించు
తరతరాల చీకటిని పొలిమేరలు దాటించు!



# శ్రీకారం

నాగరిక సమాజంలో నగుబాటు కాకురా
నవభారత పునాదికి శ్రీకారం చుట్టరా
నిన్ను నీవు తెలుసుకో చీకటి తొలగించుకో
ఓం నమ: శివయంటూ అక్షరమును దిద్దుకో ॥నాగ॥

డబ్బువున్న శ్రీమంతుడు ఆ వూరికే గొప్పరా
కూడ బెట్టినా ధనమును కుడవలేని లోభిరా
విద్య అనే ధనసంపద పంచుకొలది వృద్ధిరా
అదిపొందిన ధీమంతుడు జగానికే వెలుగురా ॥నాగ॥

అక్షరమును నేర్చుకో ఆత్మగౌరవము పెంచుకో
పసితనములో చదువలేని లోటును సరిదిద్దుకో
అక్షరమను అమృతమును ఆరగించు ప్రతినిత్యం
ఆత్మబలము పెంచునూ ముమ్మాటికి యిది సత్యం ॥నాగ॥

అడవుల బడి తిరుగుతూ ఆగడాలు చేయుచూ
పొట్టకూటికై పోరిన కిరాతకుడు ఎవడురా?
అతడేరా! రామాయణ అమృతమును పంచిన
వాల్మీకి శ్రీ శారధ గారాల విపంచిరా ॥నాగ॥



# పెన్నిధి!

మంచిచేసి పదిమందిని ఆదుకో సోదరా
మంచిమాట నినుచేయును అందరికీ దగ్గరా
కొంచెమైన ఖర్చులేని మంచిపలుకు వుండగా
రెచ్చగొట్టి మాటలాడు పరవైరము దండగా.... ॥మంచి॥

మంచనేది మానవుడికి బ్యాంకునందు సొమ్మురా
దినదినమూ వడ్డీ పెరిగి పెన్నిధిగా మారునురా
నరములేని నాల్క నీకు యిక్కట్లను తెచ్చురా
అదుపులేక వాగించి అంటించును చిచ్చురా..... ॥మంచి॥

అనరాని మాటలాడి నొప్పించకు ఎవ్వరినీ
ఆ పైన చింతించకు నోరు జారితిననీ
మంచిమైత్రి మధురమైన మాటలతో దక్కురా
మాటలాడు వరమిచ్చిన విధాతకు మొక్కురా....... ॥మంచి॥

మాటనేది ప్రకటించును మనిషిలోని భావము
ఇతరప్రాణి పొందలేని అద్భుత వర దానము
మాటల తూటాలు పేల్చి మదిగాయం చేయకురా
మాట విలువ స్నేహ చలువ తెలుసుకొని బతకరా........ ॥మంచి॥



# బాపు మార్గము

మమతలు మరువకురా మహాత్ముని వారసుడా
మానవతను చాటరా అనురాగపు బాటరా

ఏ కులమూ ఏ మతమూ పెట్టదురా కూడు
నీ తెలివి నీ శ్రమతో సుఖముల వానగూడు
మత్సరమును బాపరా హింసను విడనాడరా
మంచియనే మందిరాన మానవుడే దేవుడురా

చచ్చినవారికి పోయలేవు ప్రాణము
బతకాల్సిన వారిని చంపుట దయనీయము
పోయలేని ప్రాణము తీయు అధికారము
నీకెక్కడిదని యడిగితే ఏదీ సమాధానము?

హింసతోడ ఏ కార్యము సాధ్యము కాదని తెలుసుకో
అహింసను ఆచరించి అభాగ్యులను ఆదుకో
బాపూ మార్గము మనకు సదా శిరోధార్యము
పాపమును చేయకుంటే-చేసినట్టే పుణ్యము!





నెమ్మాని

# జాగృతి!

యువతా! నవ వ్యవస్థ నిర్మాత ఓ యువతా!
సమతను పెంచుకొని - చాటు జాతి సమైక్యతా! ॥యువతా॥

ఏమరుపాటున గతి తప్పితే నీ నడత
బాధలమయమవును బంగారు నీ భవిత
వ్యసనాలకు బలిపశువై ఆహుతైతే హీనత
మావటివై అంకుశముతో అదుపుజేయి దుర్బలత ॥యువతా॥

నీ చుట్టూ పొంచివుంది విషపు కోర రుగ్మత
నీ శక్తిని కాటేసి చెరిపివేయు నీ పంథా!
అప్రమత్తముగ నుండి పెంచుకో నీ చతురతా
ప్రభావితం చేయాలి పదుగురినీ నీ చరితా ॥యువతా॥

అడుగడుగున చెలరేగేను అలవికాని అనైక్యత
భరతమాత గుండెమంట లార్పుట నీ బాధ్యత
నిద్రాణము చేయబోకు నీలోనీ కుశలత
జాగృతించి వినువీధుల నిలుపు జాతి పతాక ॥యువతా॥

కదంతొక్కి నడుంకట్టి అందించూ చేయూత
అవినీతిని అణగదొక్కి పంచిపెట్టుమూ మమత
జాడ్యాలను జ్వలించీ పాతిపెట్టు అసమానత
నీ దేశము నుద్ధరింప నెలకొల్పు సమానత ॥యువతా॥



# వజ్రాయుధం!

కలిసిమెలిసి జీవించుటలోనే కలదు సుఖం
కక్షలు కార్పణ్యాలు విడనాడితే ఆనందం
మతమన్నది పెంచాలి మానవత్వ మమకారం
మత్సరముల తుడిచేసి మదినింపుకో అనురాగం!

ప్రకృతి మనకొసగినా జీవాధారం నీరం
ప్రతిప్రాణిని కాపాడే గాలి దేవుని వరం
పంచభూతాలకేది తారతమ్యముల బేధం
ఏల కాడు మానవుడు స్వార్థచింతనకు దూరం.

అరచేతి ఐదువ్రేళ్ళ పుష్టి విడిగ పరిమితం
ఒక్కటైతే ముష్టి బలిమి వజ్రాయుధ సమానం
భిన్నత్వంలోనే పొందు మహిమాన్విత ఏకత్వం
ధరణియందు అపూర్వం మన ఐకమత్యం!

మతంకన్న గొప్పదిరా మనదేశ భవితవ్యం
భాషకన్నా పవిత్రం భారత జాతీయం
మనిషికి అవయవమల్లే దేశానికి ప్రాంతీయం
అవిభక్త భారతం సర్వాంగ సుందరం - నవనందనం!



# తిరిగి రాని వరం!

పసిపాప నవ్వులూ ప్రకృతిలో పువ్వులు
మధువొలుకు గిన్నెలూ మురిపించే వన్నెలు!

కల్లాకపటం ఎరుగని కర్పూర దీపం
మనసును మరిపించే వెన్నెల సోపానం
ఆ పసిప్రాయం మనిషికి మరువలేని అనుభవం
మళ్ళీ పసిపాపలై పోవాలనే ఆరాటం ॥పసి॥

వంచనలు మోసాలు దరిజేరని జీవితం
ద్వేషాలు కక్షలూ కానరాని లేప్రాయం
మంచు కడుగు ముత్యంలా స్వచ్ఛతకూ నిదర్శనం
తరతమ బేధం లేని భగవంతుని స్వరూపం ॥పసి॥

అనుమానం అత్యాశల అవలి నిర్మలతీరం
కలతలు వెతలూ లేని మనసుదోచు సమీరం
మాలిన్యపు మరకలకూ ఆమది ఎంతో దూరం
సర్వం త్యాగం చేసినా తిరిగిరానిదా వరం ॥పసి॥



# ధనం మహిమ

నలువన్నైన నలుగురిలో చేయించును నాట్యం
కలువనైన పగటియందు పూయించు మహోత్మ్యం
సుధాభరిత మదిలోన నాటును స్వార్థపు బీజం
ధనమా తెలిసికొనుట మా తరమా నీ మహిమ

ప్రపంచాన్ని శాసించే మహాశక్తివీ నీవు
మనిషిని నిర్దేశించి మరమనిషిగ మార్చేవు
మత్తులోన ముంచేవు నీతొత్తుగ జేసేవు.... ॥ధనమా॥

నీవు కనికరిస్తేనే మనిషి బతుకు ధన్యం
నీ తూష్ణీ భావంతో-ఆ బతుకే శూన్యం
నీ దయపొందిన వాడే అందరికీ ఆరాధ్యం ॥ధనమా॥

మానవత్వ మమకారం మరిపించే శక్తి నీది
మత్సరముల పెంచేటి అద్భుత శ్రీ సూక్తినీది
మమతల మాయం చేసే-మహిమాన్విత స్ఫూర్తి నీది ॥ధనమా॥

రక్తబంధాలను రాక్షసంగా త్రుంచగలవు
బంధువులను భయముగొల్పు రాబందుగ మార్చగలవు
మిత్రుల శత్రువు చేసి ఆనందము పొందగలవు ॥ధనమా॥

నీనైజం యిరువైపుల పదును గల ఛురిక
రాజసం వుట్టిపడూ నీదయవుంటే గనక
గంజైనా కరువుగదా ముంచుకొస్తే నీ కినుక ॥ధనమా॥



# లోకం తీరు

మాయదారి లోకమిదీ
మమతుడిగిన కూపమిదీ
మనుగడ బహుకష్టం జీవుడా
అనురాగం ఎండమావి జీవుడా ॥మాయ॥

కరుణనేది కనుపించదు ఎచ్చటా
కౌటిల్యమే ప్రతివారికి ముచ్చటా
స్వార్థపు రాకాసురులు పొదుండిరి యిచ్చటా
ప్రతివారిని ఆకలికి ఆరగించి త్రేన్చుట ॥మాయ॥

గోముఖ వ్యాఘ్రాలు మసలు జనారణ్య లోగిలీ
మోసాలు ద్వేషాలు కలిసుండే కూడలీ
అధికారా మదమత్తుల రాగాలా జావళీ
సామాన్యుని తైలంలో వేగించే బాణలీ ॥మాయ॥

కంటికి రెప్పకు ఉన్నదా దూరము
కాటికి యింటికి కనిపించదు ఆ మాత్రము
కన్ను తెరువు విషాదాల పుట్టుకా
కన్ను మూస్తే ఆనందపు గిట్టుకా ॥మాయ॥



# ఆకలి

ఆకలి ఒక శాపం - ఆకలి ఒక శోకం
ఆకలి ఒక పాశం - ఆకలి ఒక క్లేశం!
ఆకలి ఒక కామన - అలుపెరుగని తపన
ఆకలి ఒక శోధన - అది ఆరని వేదన!
ఆకలి ఒక బాధ - అది తీరని వ్యధ
ఆకలి రాక్షసి ముందర - అవనిలోన అన్ని వృధా!
ఆకలి నీ నీడ - నినువీడని జాడ
మండుతున్న కాగడ - మాసిపోని రగడ!
ప్రకృతిలో ప్రతిప్రాణిని - భయంకరంగా బాధిస్తుంది
మంటలలో మాడుస్తుంది - బొమ్మను చేసి ఆడిస్తుంది!
ఆకలి హింసిస్తుంది - ధ్వంసం చేసి హసిస్తుంది
సాధనకై నినుసాధిస్తుంది - [illegible]లతో ప్రాణం తీస్తుంది!
పొంచివుండు శత్రువది - కూతాపని తీతువదీ
ప్రతినిత్యం క్రతువునీ - జరిపించే ఋత్విక్కదీ!
అప్పులు కుప్పలు చేయిస్తుంది - ముప్పుతిప్పలూ పెట్టిస్తుంది.
అంతస్తులను మరిపిస్తుంది - ఆస్తులన్నిటినీ హరియిస్తుంది!
సంక్షోభ భరితము - స్వార్ధ పూరితము
చైతన్యవంతము - తెగింపు అనంతము!
వేధిస్తుంది-వేపేస్తుంది, పీడిస్తుంది-ఏడ్పిస్తుంది
నేరక నేరం చేయిస్తుంది, ఆనక హంతకులుగా మారుస్తుంది.
కోట్ల ధనం వున్నా - కొండంత సంపదలున్నా
పిడికెడు అన్నం లేకున్నా - అవన్నీ గుండుసున్నా!
ఆకలికేది పర్యాయం - ఎదురనేది దానికి పూజ్యం

లొంగదు దేనికి ఆ భూతం - దైవానిదైనా రెండోస్థానం!
ఆకలి పేకలు తెగితే...... ఆకలి ఆవిరి అయితే......
ఆకలి కేకలు లేని - అదో జగతి ఏర్పడితే......
మొత్తుతుంది మొహం - బతుకంతా నిస్సారం
అభివృద్ధి శూన్యం - మనిషి బతుకు వ్యర్థం!
పసిపాపలు పాలకొరకు - ఏడ్వరు ఏనాడు
కమ్మనైన అమ్మప్రేమ - కొరగాని సరుకానాడు!
అంతే కాదు-చదువులెందుకు - సంధ్యలెందుకు
ఉపాధికొరకు - ఉబలాట మెందుకు?
కొలువులెందుకు - కూళ్ళు ఎందుకు
బతుకు తెరువుకు - దోబూచులెందుకు?
బరువు లెందుకు - బాధ్యత లెందుకు
బంధాలెందుకు - బంధుత్వాలెందుకు?
వ్యాపారాలెందుకు - విపణి ఎందుకు
విలువలుడిగిన - విత్తమెందుకు?
విప్లవమెందుకు - ఉద్యమమెందుకు
ఉద్ధరింపుల - ఊక దంపుడెందుకు?
రాజ్యాలెందుకు - పదవులెందుకు
పదవుల పంచన - వంచనలెందుకు?
రైతు ఎందుకు - శ్రామికుడెందుకు
పంచ భూతముల - ఉనికి ఎందుకు?
పండగ లెందుకు - పబ్బాలెందుకు
పరిశ్రమలు - ప్రాజెక్టులెందుకు?
అవియివి యనే - బేధమెందుకు
ఆకలిలేని - ఈ జగమెందుకు?
పరబ్రహ్మ స్వరూపం - అన్నమే అన్నది వేదం

ఆహారం మాత్రమే - ఆకలికి ఉపశమనం!
నీతి వుండదు - జాతి వుండదు
నీవు నేనను - తేడా వుండదు!
దేశముండదు - ప్రాంతముండదు
ప్రపంచమందున - ఎల్ల వుండదు!
కులం వుండదు - మతం వుండదు
లింగ బేధముల - వ్యత్యాసముండదు!
కలిమి లేములకు - అతీతమైనది
జీవధాత్రికి - బలము నిచ్చునది!
అవధులు మించిన - ఆకళ్ళున్నా
అన్నిటికన్నా - అన్నమాకలే మిన్న!
రాజులకు రారాజు అదీ - ఆత్మలకు పరమాత్మ అదీ
పేదలకు పెత్తందారు అదీ - రోగుల చెంతకు చేరనిదీ!
దుర్భరమైనదీ - దుర్జయమైనది
అజేయమైనది - అనంతమైనది!
రాజ్యమేలినా - రణము చేసినా
రాళ్ళు మోసినా - బీళ్ళు దున్నినా
కూడబెట్టినా - కుదువతెచ్చినా
ఏమిచేసినా - ఎన్నినేర్చినా
కొండ ఎంతటి - పెద్దది అయినా
కుంచించుకు పోదా - అద్దమందున!
జీవకోటిలో - ఉద్దండులు వున్నా
జావకారరా - ఆకలి ముందెవరైనా
ఆకలీ! జీవిని - అంతం చేయకు
ఆదుకో తల్లీ - అవసరమైన వేళకు!!!



# కొరకంచు!

సంసారపు నావకు రంధ్రమండీ సారా
సుడిగుండంలో ముంచి నవ్వుతుంది మనసారా
సార త్రాగి నిస్సారం చేసుకోకు కాపురం
సారమాని చక్కంగా దిద్దుకోండి సంసారం ॥సంసా॥

పచ్చనైన బతుకునూ మోడుజేయు సారా
తుచ్ఛమైన వ్యసనాలకు డబ్బంతా దుబారా
యిల్లుగుల్ల-వొళ్ళుగుల్ల-పరువు పటాపంచలూ
కల్లుసారా ప్రతి మనిషినీ కాల్చే కొరకంచులూ ॥సంసా॥

మేకతోలు కప్పుకున్న పులిరా వారుణ వాహిని
గోవులాంటి మనిషికి భస్మాంతక మోహిని
నీవూ మరణించు విషం త్రాగబోకు తమ్ముడా
ఎంత చెప్పినా వినవు నీకేమి చెముడా ॥సంసా॥

తెలుసుకోర సారాతో కాలేయము కాలుననీ
పెద్దలు చెప్పిన మాట మనకు చద్దిమూటనీ
కనరా మహిళల స్ఫూర్తి కోట్ల కన్న విలువనీ
వనితల నెదిరిస్తే నీవు మనగల్గుట కష్టమనీ ॥సంసా॥



# ఆంధ్ర గాంధీ!

గాంధీజీ వారసుడు మన వావిలాల
గాంధేయ మార్గమునే నమ్మిన గోపాల
కృష్ణ గీతనూ పోలిన మద్యపాన నిషేధం
అయ్యలాగ ఆదరముగ బోధించిన నవవేదం!

వాత్సల్యము పంచేటి నిరాడంబర జీవి
విఖ్యాతుడిగా వెలిగే మహిమాన్విత స్ఫూర్తి
లాలిత్యము మదినిండిన మచ్చలేని తేజస్వి
లక్షల గుణ సంపన్నుడు పటుతర సత్యాన్వేషి!

ఆ గోపాలకృష్ణుడు ఎంత చక్కనీ చతురుడు
ఈ గోపాల కృష్ణుడు మేరు శాంత స్వభావుడు
గగనమంత విశాలం - సంద్రమంత అగాధం
వావిలాల ధవళమదీ-మరపించును నవనీతం

సామాన్యుల బతుకులోన వెలుగులు విరియాలనీ
ఊరూ వాడ హోరెత్తగ మద్యపాన మొద్దనీ
ప్రతివారికీ నచ్చజెప్పి ఉద్యమాన్ని నిర్వహించి
మద్యాసుర సంహారం సలిపిన ఆంధ్రా గాంధీ!

పదవీ వ్యామోహాలు గిట్టని సచ్చరితుడు
అహమన్నది పొడసూపని అజాత శత్రుడు
భారతికి ముద్దుబిడ్డ-ఓ భారత రత్నమా
ఆయువు ఆరోగ్యాలతో నిరతం వర్ధిల్లుమా



నెమ్మాని

# కాల ఖండము

కాలమూ అమూల్యమూ జారవిడుచుకోకురా
నిర్లక్ష్యము చేసితివా తిరిగి నీకు దక్కదురా!

పెదవిని దాటిన మాట పృథ్విని దాటేనురా
విల్లును విడిచిన బాణం తిరోముఖం కాదురా
గడిచిన కాలాన్ని మళ్ళీ కళ్ళ చూడలేవురా
అవకాశం చేజారితే అందుట దుస్సాధ్యమురా
ప్రతిక్షణమూ కోట్లకొలది ధనముకన్న విలువరా
అనుక్షణమూ అది తెలిసి మసలుకో సోదరా!

కాలగమన చక్రానికి అడ్డనేది లేదురా
పరుగెత్తే సమయానికి పగ్గమేయలేవురా
ఆకాశానికి నిచ్చెన దుర్లభమని తెలియరా
సమయపు వినియోగము సర్వదా రక్షరా
ఏ వేళకు ఏది నీవు చేయాలో ఎరుగరా!
ఏమారితె దేవుడైన ఆదుకోడు నిన్నురా!

ప్రతివ్యక్తికి ఉండాలీ చక్కని ఓ ధ్యేయము
నిత్యకృషితో చేరాలీ ఎంచుకున్న గమ్యము
అలసత్వం ముమ్మాటికి నయంకాని దౌర్బల్యం
ప్రక్క చూపు వక్రబుద్ధి ప్రగతి నడ్డు కుడ్యము
ఓడిన ప్రతివారికి గతమనేది సత్యము
గెలిచిన ప్రతివ్యక్తికి భవిష్యత్తు తథ్యము!!!



# అహా ప్రస్థానం!!

హల్లో!
బావున్నారా?
బాగానే వుంటారులెండి
నా పలకరింపు లేనంతవరకు!
నా పరామర్శ స్పర్శించనంత వరకు
మీరు క్షేమంగా వుంటారు!

నేనెవరినని తెగ ఆలోచించకండి!
నేనంటే జీవులకు భయం
లేదు నానుంచి రక్షించే అభయం!
ప్రతిప్రాణిని జీవితంలో
ఒక్కసారే పలుకరిస్తాను!
నేను పలుకరించిన తర్వాత
మరెవ్వరూ పలుకరించలేరు!

నా అంతేమిటో తెలుసుకోవాలనే తపన
కనీసం అద్రసైనా కనుక్కోవాలని యాతన
ఏ శక్తీ నన్ను ఆపలేదు
ఏ యుక్తీ నన్ను బోల్తా కొట్టించనూ లేదు
నన్ను తప్పించుకోవటం ఎవరితరం?
అలాగని లేదు ఏ కోశాన అహంకారం!

ప్రకృతి ధర్మాన్ని నేను
సర్వప్రాణులకు సమవర్తినినేను!
వివక్షతలకు దూరం నేను
వివాదాల జోలికి పోను!

మమతలకు నా దగ్గర తావులేదు
సమతకు ఏ మాత్రం కొదువలేదు
మీరు నడవలేని సన్మార్గపు బాటలు
నాపాలిటి వరాల మూటలు!

అనురాగాలకు అతీతం నేను
అనుబంధాలకు అంకితం కాను!
తిట్టినా కోపం తెచ్చుకోను
ప్రతీకారానికి పంతం పట్టను!
కన్నీళ్ళకు రవ్వంతైనా కరగను
నాకైనేను కక్షతో వ్యవహరించను!
విధి లిఖితానికి ఎదురు తిరగను
విద్యుక్తధర్మానికి విఘాతం కలిగించను!
పక్షపాత రహితంగా మనగలను
కుక్షి కొరకు కుమ్ములాడను!
నాకు లేరు ఎవరు బంధువులు
ఉన్నా ఎక్కించను వారసత్వ పదవులు!

ఇంకో విషయం తెలుసా మీకు
మీ వల్ల సుగమం నా పని తీరు!!!
నేనెట్లాగూ నావిధిని నిర్వహిస్తానన్నానా?
మీలో కొందరు నా శ్రమను తగ్గిస్తున్నారు!!!
మీలో మీరే యుద్ధాలు సృష్టించుకొని
కక్షలు కార్పణ్యాలు పెంచుకొని
కులాల కుళ్ళు పులుముకొని
మతాల నడ్డం పెట్టుకొని
మౌఢ్యాలకు బానిసలై
మత్సరాలకు తొత్తులై

వర్ణాల వెర్రితో
రాష్ట్రాల రచ్చతో
రాజకీయ రంగుతో
కృతఘ్నతే కవచంగా
భాష పనుపున
ప్రాంతం ప్రాపున

దేశం పేరుతో
ద్వేషమే ధ్యేయంగా
ఉగ్రవాదమే ఉనికిగా
అర్థమే పరమార్థంగా

ప్రతివారిలో స్వార్థం బలిసి
పవిత్రత లోపించి
ఉన్మత్తత ప్రకోపించి
పరపీడన వూడలువేసి

మీలో మీరే కలహించుకొని
పశువుల కన్నా హీనంగా
పక్షులకన్నా హేయంగా
జంతువులకన్నా జుగుప్సగా
మృగాలకన్నా మూర్ఖంగా

బాంబులతో
మారణాయుధాలతో
చురకత్తులతో
ఏ.కె. 47లతో

కాల్చుకుంటూ
పేల్చుకుంటూ
పొడుచుకుంటూ
నరుక్కుంటూ
మారణ హోమాలు సృష్టించుకుంటూ
మానవాళి మనుగడకు మచ్చలౌతున్నారు!
కాగల కార్యానికి కారణ భూతులౌతున్నారు!

ఈ లిటిగేషన్ కూడా వినండీ
మీ వ్యవహారాల నిబంధనలు కనండి!
వచ్చేటప్పుడు పర్మిట్‌తో వస్తున్నారు
విదేశాలకెళ్ళినట్టు వీసాలతో వస్తున్నారు!
పర్మిట్ వున్నంతవరకే మీకు పర్మిషన్
హరిహరాదులడ్డుకున్నా లేదు కన్సెషన్!
వీసా గడువు ముగిస్తే నో రెన్యూవల్
విధి నిర్వహణలో నేను చాలా పంక్చువల్!
టైం దాటితే ఎంతటి ఖాతా అయినా క్లోజ్
కాలం దాపురించక పోతే ట్రయల్సన్నీ వేస్ట్!

మహారాజని అడుగులకు మడుగులొత్తను
మహామంత్రని మర్యాద చేయను!
వీరాధివీరుడైనా వీపు చూపను
అహంభావియని ఆలస్యం చేయను
విజ్ఞానియని విస్మరించను
అజ్ఞానినైనా కనికరించను
గొప్పవారని పీటలు వేయను
బికారియని బిడియపడను
కన్నీళ్ళకు కరగను

కాఠిన్యాలకు జడవను.
పసివారనీ-
పండు ముదుసలనీ-
ఆడవారనీ,
అర్భకులనీ,
పురుషోత్తములనీ,
పుణ్యమూర్తులనీ,
జంతువులనీ
జలచరాలనీ
తరతమ బేధం లేదు

ప్రకృతి ధర్మాన్ని నేను
సర్వప్రాణులకు సమవర్తిని నేను
మమతలకు నాదగ్గర తావులేదు
సమతకు ఏ మాత్రం కొదువలేదు
నేనొక రహస్యాన్ని!
నేనొక నిగూఢాన్ని!
ఈ నాటి వరకు ఎవరూ ఛేదించలేదు
ముందే నాటికి ఛేదించలేరు
రహస్యం రహస్యమైతేనే బతుకు శోభిల్లు
గుట్టు రట్టయితే బండరాతి గుండైనా గుభిల్లు
ఆశ జీవితాలకు అవసర ధ్యేయం
అత్యాశ అనర్థాలకు నిలయం

నా తలపుతోనే మీ బతుక్కి విలువ
నేను లేకుంటే జీవితం ఘనీభవం కాదా?
ఈ సృష్టి ఒక సైకిలు చైను పరంపర
నిలకడగా దేని నాపిందీ విశ్వంభర?

వచ్చింది పోవాలి
పోయింది రావాలి
మార్పునేది కావాలి
వచ్చి మాసిపోవాలి
అదేకదా సృష్టి-
ఎందుకు ఎదురీత?
అదేకదా పుష్టి-
ఏరువాలుకు సాగిపోక?

జీవకోటిలో వరప్రసాదితులు మీరు
జ్ఞానం కలిగిన వితరుణులు మీరు.
మీకున్న గడువు చాలా తక్కువ
బ్రతుకు విలువ తెల్సి మసలుకో మానవా!
చావుకు జడుసుకొనుట మానాలి
నీ నడత చూసిన చావే భయపడాలి!

జాతస్వ హిధృవో మృత్యు:
ధృవం జన్మ మృతస్యచ
తస్మాద పరిహార్యేర్థే
నత్వం శోచితు మర్హసి॥



# ధన్యం - దైన్యం

ధర్మభూమి ఈ భారతదేశం
పవిత్ర మూర్తుల కర్మభువనము
పసిడి పంటల ధాన్యాగారం
పుణ్యనదులతో సారవంతము
స్నేహభావమే అనుసరణీయం
శతృవునైనా ఆదరించును
ఇతిహాసములకు యిది పుట్టిల్లు
ఇలదివిగా నిత్యం శోభిల్లు
విక్రమార్కులు, కృష్ణరాయలు
చంద్రగుప్త చాణక్య గురువులు
శాంతికాముకుడు గౌతమ బుద్ధుడు
అహింసావాది గాంధీ మహాత్ముడు
విజ్ఞాన తేజము వివేకనందుడు
మానవత్వపు నిధి అశోకుడు
మరాఠ సింగము వీరశివాజి
మన్నెంపిడుగు మన అల్లూరి
ఝాన్సిలక్ష్మి, జీజియాబాయి
దైవత్వం నిండిన మీరాబాయి
మహనీయుల జన్మతోధన్యమైనది
విశ్వమందు విఖ్యాతిగన్నది
ధర్మభూమి ఈ భారతదేశం
పవిత్రమూర్తుల కర్మభువనము



అం

ఇది అంతా ఒకనాటి స్వరూపం
గతమంతా ఘనకీర్తి వైభవం
వింటారా ఈనాటి చరితము
భయముగొల్పు బీభత్స దృశ్యము.
స్నేహభావము సన్నగిల్లినది
పసిడి స్వప్నము చెదిరి పోయినది
అసత్యవాదులు అందలమెక్కిరి
వాగ్దాన హోరులో ప్రజల ముంచిరి.
స్వార్థపరత్వపు సంకుల సమరం
మత మౌఢ్యాల వీరవిహారం
సత్యహింసల మారణహోమం
నిత్యహత్యలతో రక్తతర్పణం
నవ్వులపాలై న్యాయవర్తనము
నీతినిజాయితి నీరు గారెను
భారతమాత దేహభాగములను
వేలంవేసే వేర్పాటు వాదులతో
కర్మభూమి కన్నీరు కార్చెను
ధర్మభూమి యెద దద్దరిల్లెను
జాతి జవాన్ని నీరుగార్చును
జన్మభూమిని జల్లెడ చేసెను
భ్రష్టాచారము పడగవిప్పెను
వేయినాల్కలతో వెక్కిరించెను
ధర్మమార్గము కంటకమయమై
గమ్యమనునది అగమ్యమైనది

ధరల సూచి ధరను వీడెను
పౌరులను తిరుక్షవరము చేసెను
విశృంఖలమాయెను నిలువుదోపిడి
ఎంతైనా సరిపోదు రాబడి
దుర్మార్గపు ధూర్తులు విజృంభించిరి
సన్మార్గబాట రుధిరాన తడిపిరి
గోమాయువు జిత్తుల ఆటలాడిరి
గోముఖపులులై సంచరించిరి
ఉగ్రవాదమే ఊపిరి యనుకొని
విచక్షణను వినువీధుల కొదిలిరి
నిరాశ నిస్పృహలో యువత మునిగిరి
దారితప్పి పెడదారి త్రొక్కిరి
అవలీలగ తమపరమవ్వాలని సిరి
అడ్డదారులలో ఆర్జన మరిగిరి
ఎటు జూసినా విపరీత అలజడి
క్రుంగెను దేశము దీని పాలబడి
మమతల మతలబు మదిని మరచిరి
మత్సరాగ్నిలో నిత్యం మరిగిరి
తల్లిదేహము రుగ్మతలతో నిండి
అనారోగ్యమున తల్లడిల్లినది
భారతానికి తలమానికము
మాతనుదుట సుందర సింధూరము-
మరులుగొల్పు హిమ కాశ్మీరము
భారతాన అది అంతర్భాగము
పొరుగు వారికి కన్నుకుట్టెను

ఇరుగుఈసు ఇక్కట్లు తెచ్చెను
రాహుకేతువుగా కబళించాలని
కుటిలెత్తులతో కృంగదీసినది.
తల్లిరుజల తొలగించాలన్నా
శిరోవేదనము నయమవ్వాలన్నా
పూర్వవైభవము తిరిగి రావాలన్నా
మమతలు వెల్లివిరియాలన్నా
భారతి ఎదరంజింపాలన్నా
గమ్యము మనమూ చేరాలన్నా
అన్యాయం అంతమవ్వాలన్నా
నీతినిజాయితి నిలవాలన్నా
దేశభక్తిని మదిని నింపుకో
ఐకమత్యమున బలము పెంచుకో
మతమును వ్యక్తిగతము చేసుకో
హితమును పదిమందితో పంచుకో
భస్మము చేయుము భ్రష్టాచారము
వశ్యము చేసుకో సదాచారము
కంటక నాశము నీ కర్తవ్యము
గుంటనక్కలను తుదముట్టించుము
కన్నతల్లినే కన్నభూమియిది
అన్నపూర్ణకే అసలు పెన్నిధి
తల్లి ఋణమును తీర్చుటమనవిధి
జాగృతించు యిక లేదూ వ్యవధి !!

